# అడుగుజాడ-గురజాడ

మహాకవి గురజాడ జీవితం-
సాహిత్యపరిచయం

రచన: కె. బాబూరావు



పబ్లిషర్స్:
బాలవిజ్ఞాన ప్రచురణలు
93/1, కో-ఆపరేటివ్
ఇండస్ట్రియల్ ఎస్టేట్,
బాలానగర్,
హైదరాబాదు-500 037.
ఫోన్ : 261351.

# అడుగుజాడ — గురజాడ

రచన : కె. బాబూరావు

బాలవిజ్ఞాన ప్రచురణలు నెం. 1002.
ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి 1990.

వెల : 12-50

బాలవిజ్ఞాన ప్రచురణలు
టైటిల్ డిజైన్, అలంకరణ

ఎ.వి.బాబు సురేంద్ర

లేజర్ టైప్ సెట్టింగ్:
కంపోగ్రాఫిక్స్
విజయవాడ-520 002.

ప్రతులకు :
బాలవిజ్ఞాన ప్రచురణలు
హైదరాబాదు-500 037.
ఫోన్ : 261351.
బాలజ్యోతి పబ్లిషర్స్
విజయవాడ-520 002.
ఫోన్ : 74005.

# విషయసూచిక


కొత్త వరవడి 5

పుట్టుక, చదువు 13

ఉద్యోగ పర్వం

కన్యాశుల్కం

మూఢ వ్యవస్థపై పోరాటం 33

తోకచుక్క

పుత్తడిబొమ్మ పూర్ణమ్మ 41

'కన్యక' 48

ఆణి ముత్యాలు 52

'లంగరెత్తుము' 56



విజయనగరంలో గురజాడ జీవితాంతం వరకు వుండిన యిల్లు



చనిపోవడానికి ముందర నిర్మాణం పూర్తి అయ్యింది.
గృహ ప్రవేశమూ జరిగింది కాని నివసించలేదు

# కొత్త వరవడి



మనం జీవిస్తున్న నేటి కాలాన్ని ఇరవయ్యో శతాబ్దం అంటాం. శతాబ్దం అంటే నూరు సంవత్సరాలు. 1901 నుంచి మొదలై 2000 వ సంవత్సరంతో ముగిసే కాలం ఇరవయ్యో శతాబ్దం. దీన్ని ఆధునిక కాలం అని వ్యవహరిస్తాం.

ఆధునిక కాలంలో గురజాడ అప్పారావు మహాకవి. ఆయన కవి మాత్రమే కాదు; నాటకాలు, కథలు, వ్యాసాలు మొదలైన వెన్నో రాశారు.

ఈ నాడు మనం పుస్తకాలలో పత్రికలలో చదువుతున్న వాడుక భాషకు వరవడి దిద్దిన వాడు గురజాడ. ఆయనకు ముందు రచనలు చేసినవారు మామూలు ప్రజలకు అర్థంకాని భాషలో రాసేవారు. దాన్నే గ్రాంధిక భాష అంటారు. అది ఇనుప గుగ్గిళ్ళమాదిరిగా ఉండి మామూలు చదువు వదువుకొన్నవారికి

మింగుడు పడేదికాదు. ఆ భాష ప్రజల్ని విద్యకు దూరంచేసింది. విద్య పండితుల సొత్తుగా ఉండిపోయింది. పైగా ఆ భాష, అందలి విషయాలు ఆధునిక కాలం అవసరాలకు సరిపోనివి.

గురజాడ అప్పారావుకు ఆదారిలోనే నడవడం గిట్ట లేదు. కొత్తదారి వేయాలని కోరుకున్నారు.

ప్రజలు ఏ భాషలో అయితే తమ సుఖదుఃఖాలను సాఫీగా హాయిగా వెల్లడిస్తున్నారో ఆ భాషను మాత్రమే వాడాలి అని ఆయన చెప్పారు. అదే సజీవమైన తెలుగు భాష. అది అందరికీ అర్థమవుతుంది. అందువల్ల ప్రజలకు సులభంగా చదువు అబ్బుతుంది. అది నాగరి కతా సాధనం అవుతుంది - అని గురజాడ అప్పారావు నమ్మారు. భాషతో పాటే భావాలలో కూడా మార్పు రావాలని ఆయన కోరారు. సంఘ సంస్కరణను అవి ప్రోత్సహించేవిగా కొత్త రచనలు రావాలన్నది ఆయన ఆశయం.

తాను చెప్పిందే గురజాడ చేసి చూపించారు. 'ముత్యాల సరం' అనే కొత్త పద్ధతిలో కవితలు రాశారు.

"దేశమును ప్రేమించు మన్నా
మంచి అన్నది పెంచుమన్నా"

అనే ఆయన దేశభక్తి గీతాన్ని నేటికీ పాడుకొంటున్నాం.

"దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి"

అనే గొప్ప మాట చెప్పారు. దేశమంటే పూజా పునస్కారాలు చేయాల్సిన దేవతామూర్తి కాదు. మనుషులే దేశం. దేశాన్ని ప్రేమించడం అంటే మనుషుల్ని ప్రేమించడం.

ప్రపంచంలోనే దీనికి సాటివచ్చే దేశభక్తి గేయం అరుదు. 1910 లో రాసిన ఈ గేయం నవీన

కవిత్వానికి ఆరంభ గీతం అనవచ్చు.

తేలైన మాటలు కూర్చుకొని ముత్యాల సరములు గుచ్చాడు. అది పాత కొత్తల మేలు కలయిక; కొత్త వెలుగులు విరజిమ్మింది.

ఆనాటి సంఘంలోని పరిస్థితులను కథావస్తువుగా తీసుకొని నాటకం రాసిన మొట్టమొదటివాడు కూడా గురజాడే. ఆయన రాసిన కన్యాశుల్కం తెలుగులో మొట్టమొదటి సాంఘిక నాటకం.

అంతకు ముందున్నవన్నీ పురాణాలనుంచి చరిత్ర నుంచి తీసుకున్న కథల ఆధారంగా రాసిన నాటకాలే. కన్యాశుల్కం లోని పాత్రలన్నీ మనం నిత్యజీవితంలో ఎరిగినవే. అవి మాట్లాడే భాష మన చెవులు రోజూ వినేదే. అందువల్ల ఆనాటకం చాలా సహజంగా ఉంది. ప్రజలు తండోప తండాలుగా ఆనాటకం చూసి ఆనందించారు.

వాడుక భాషలోని అందాన్నీ, జనాన్ని రంజించే శక్తినీ కన్యాశుల్కం నాటకం రుజువు పర్చింది.

కొత్తమాదిరి చిన్న కథ రాసిన మొదటివాడు కూడా గురజాడే. "దేవుడు చేసిన మనుష్యుల్లారా! మనుష్యులు చేసిన దేవుళ్ళారా! మీ పేరేమిటి?" అనేది ఆయన కథల్లో గొప్పది. ఆయన రాసిన కథలు తక్కువే అయి నప్పటికీ "ఒక్కొక్కటీ ఒక్కొక్క వజ్రపు తునక".

వాడుక భాషకు గౌరవం ప్రచారం కల్పించిందీ, కొత్తఛందంలో కవిత్వం రాసిందీ, మొట్టమొదటి సాంఘిక నాటకం రచించిందీ, తెలుగులో చిన్నకథకు తొలిరూపు ఇచ్చిందీ గురజాడ. అందుకే ఆయన తెలుగువారు ప్రేమతో స్మరించే మహాకవి అయ్యారు. ఆయన ప్రవేశపెట్టిన వాడుక భాషను ప్రజలే బ్రతికించుకున్నారు.

వాడుక భాషకోసం సాగించిన ఉద్యమంలో గురజాడకు సహయోధుడు గిడుగు రామ



గురజాడకు
సహయోధుడు
గిడుగు రామమూర్తి

మూర్తి పంతులు(1863-1940). కురుక్షేత్ర మహా యుద్ధంలో కృష్ణార్జునులు ఎలాగో, గ్రాంధిక భాషా వాదులపై జరిపిన కలం పోరులో గురజాడ గిడుగులు అలాగే. వారిద్దరూ కలిసి పత్రికల్లో, సభల్లో, మద్రాసు విశ్వవిద్యాలయంలో గ్రాంధిక భాషావాదులతో అలసట ఎరుగకుండా తలపడ్డారు. తిరుగులేని వాదనాబలం గిడుగువారిది. అందుకే గిడుగు పిడుగుగా పిలువబడ్డారు. అసమాన రచనాశక్తి గురజాడ వారిది.

ఒకరు భాషలో మరొకరు సాహిత్యంలో తెలుగునాట ఆధునిక యుగం ఆరంభానికి కర్తలయ్యారు.





విశాఖపట్నంలో
గురజాడ విగ్రహం

# పుట్టుక, చదువు



గురజాడ అప్పారావు 1862వ సంవత్సరం సెప్టెంబరు 21న విశాఖపట్నం జిల్లాలో రాయవరం అనే గ్రామంలో పుట్టారు. అది ఆయన తాతగారి (తల్లి గారి తండ్రి) ఊరు.

తండ్రి వెంకట రామదాసు, తల్లి కౌసల్యమ్మ. అప్పారావు గారి తండ్రి, తాతల స్వగ్రామం కృష్ణా జిల్లా, గన్నవరం తాలూకా, గురజాడ. ఆ ఊరు పేరే వారి ఇంటిపేరు అయ్యింది.

వెంకట రామదాసు ఉద్యోగం కోసం కృష్ణాజిల్లా నుంచి విజయనగర సంస్థానానికి వచ్చారు. ఆయన చీపురుపల్లిలో పని చేస్తున్నప్పుడు అప్పారావు ప్రాథమిక పాఠశాలలో చదువు మొదలెట్టారు. పది సంవత్సరాల వయస్సు వచ్చేవరకు చీపురుపల్లి లోనే చదువుకున్నారు. తరువాత విజయనగరంలో విద్యాభ్యాసం కొనసాగించి

1886 లో బి.ఎ. డిగ్రీ పొందారు.

## ప్రభావాలు

అప్పారావు పుట్టి పెరిగిన కాలం మనదేశ చరిత్రలో చాలా ముఖ్యమైంది. 1857 లో సిపాయిల తిరుగుబాటు జరిగింది. అది ఆనాడు భారత దేశాన్ని బలవంతంగా ఆక్రమించుకొని పరిపాలిస్తున్న బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన మొట్టమొదటి స్వాతంత్ర్య యుద్ధం.

అదే సంవత్సరం కలకత్తా, బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయాలు ప్రారంభమయ్యాయి. ఆమరుసటియేడు తూర్పిండియా కంపెనీ పరిపాలన పోయి సీమరాణి పాలన మొదలయ్యింది. ఆమె విక్టోరియా మహారాణి.

అప్పటికే ఇంగ్లీషు చదువు దేశంలో వేరూనింది. ఇంగ్లీషు చదువుకుంటే నెలసరి జీతాలు వచ్చే ఉద్యోగాలు

దొరుకుతాయని, పలుకుబడి హోదాలతో పాటు డబ్బుగ డించ వచ్చునీ మన దేశీయులకు కొత్తఆశలు పుట్టాయి. ఇంగ్లీషుమీద మోజు పెరిగిపోయింది. ఉద్యోగావకాశాలు విస్తరించాయి.

ఇంగ్లీషు సాహిత్యం పరిచయం కావటంవల్ల కథ, నవల, నాటకం, వ్యాసం, జీవిత చరిత్ర మొదలైన కొత్తశాఖలమీద ఆసక్తి పుట్టింది. విద్యారంగంలో, సాహిత్యరంగంలో కొత్త అవకాశాలు, అభిరుచులు కలి గాయి. సంఘంలో కొత్తవిలువలు, కొత్త పద్ధతులు, కొత్త ఆకర్షణలు బయలు దేరాయి.

అదే కాలంలో తెల్లవాళ్ళు సీమనుంచి యంత్రాలు తెచ్చారు. మిల్లులు పెట్టారు. రోడ్లు వేశారు. నదుల మీద ఆవిరి ఓడలు ప్రవేశ పెట్టారు. రైళ్ళు నడిపారు. తంతి తపాలాలు పరిగెత్తించారు. అచ్చు యంత్రాల ద్వారా పుస్తకాలు, వార్తాపత్రికలు అందుబాటులోకి తెచ్చారు. రైలు మార్గాలు, తంతి తపాలాలు దేశం

లోని వివిధ ప్రాంతాలను కలిపాయి. ప్రజల మధ్య పరస్పర సంబంధాలను వృద్ధి చేశాయి.

తెల్లవాళ్ళు అనుకోని మరొక మంచి కూడా జరిగింది. అదేమిటంటే, ఈ కొత్త సాధనాలన్నీ దేశమంతటా జాతీయ వాదం అల్లుకు పోవటానికి ఉపయోగపడ్డాయి.

అప్పారావుగారు బి.ఎ. డిగ్రీ పొందటానికి ఒక సంవత్సరం ముందు, అంటే 1885 డిశంబర్ లో భారత జాతీయ కాంగ్రెస్ అవతరించింది. మొత్తంమీద ఈ మార్పుల కొత్తస్వరూపం గురజాడకు నచ్చింది. ఆయన మెచ్చుకున్నారు.

గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
క్రొత్తపాతల మేలుకలయిక
క్రొమ్మెరుంగులు చిమ్మగా.

..........................................

తూర్పు బలబల తెల్లవారెను.
తోక చుక్కయు వేగు చుక్కయు.
ఒడయుడౌ వేవెల్గు కొలువుకు
వెడలి మెరసిరి మిన్ను వీధిని.

వెలుగు నీటను గ్రుంకె చుక్కలు,
చదల చీకటి కదల బారెను;
ఎక్కడనో ఒక చెట్టుమాటున
నొక్క కోకిల పలుకసాగెను.

మేలు కొలుపులు కోడికూసెను
విరులు కన్నులు విచ్చి చూసెను
ఉండి, ఉడిగియు, ఆకులాడగ
కొసరెనో యనగాలి వీచెను”

అని గురజాడ అద్భుతంగా వర్ణించారు.

ఈ మంచితో పాటు తెల్లవాళ్లు మనల్ని ముంచారు. మన సంపదని దోపిడీ చేశారు. మన ప్రజలకు కటిక పేదరికాన్ని మిగిల్చారు.

దీన్నే వలస స్వభావం అంటారు. ఈ వలస స్వభావాన్ని అప్పారావుతో సహా చాలామంది పండితులు, రచయితలు మొదట్లో పసిగట్టలేకపోయారు.

గురజాడ తాను కాలేజీలో చదివే రోజుల్లోనే ఇంగ్లీషులో కవిత్వం రాసేవారు. ఆ కాలంలో విజయనగరం నుంచి 'ఇండియన్ లీజర్ అవర్' (Indian leisure hour) అనే ఇంగ్లీషు పత్రిక వెలువడుతూ వుండేది.

గురజాడ 'సారంగధర' కావ్యం ఆ పత్రికలో అచ్చయింది.

ఆనాడు గొప్ప పత్రికా సంపాదకుడని పేరు తెచ్చుకొన్న శంభుచంద్ర ముఖర్జీ 'సారంగధర' ఇంగ్లీషు కావ్యాన్ని చదివి చాలా మెచ్చుకున్నారు. అప్పారావు

గారితో ఆయన ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపారు.

"దేశశ్రేయస్సు కోసం పాటుపడవలసిన బాధ్య తను గుర్తించినవారు....అమితమైన కష్టాలు పడటానికి సిద్దమై వుండాలి" అని ముఖర్జీ 1884లో గురజాడ అప్పారావుకు ఉత్తరంలో తెలిపారు.

జాతీయ భావాలు ఆనాడు దేశంలో చదువుకున్న వారిని ఏ విధంగా ఆకర్షిస్తున్నాయో తెలుసుకోవడా నికి ఇది ఉదాహరణ.

అప్పారావుగారికి శ్యామలరావు అనే తమ్ముడుండే వాడు. అతడు కూడా కవి. మద్రాసు లా కాలేజీలో చదువుతూ అకాలమరణం చెందాడు. భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించిన హ్యూమ్, జాతీయ నాయకుడు డబ్ల్యు.సి.బెనర్జీ మొదలైన వారి మీద శ్యామలరావు ఇంగ్లీషులో పద్యాలు రాసి 'హిందూ' ('THE HINDU') పత్రికలో ప్రచురించాడు.

## ఉద్యోగ పర్వం

గురజాడ బి.ఎ.డిగ్రీ తెచ్చుకోకముందే విజయనగరం కళాశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేశాడు.

తరువాత ఫిలాసఫీ (తత్వ శాస్త్రం) అభిమాన శాస్త్రంగాను, సంస్కృతం రెండవ భాషగాను బి.ఎ. పాసయ్యారు. 1887 ఏప్రియల్ లో విజయనగరం డెప్యూటీ కలెక్టరాఫీసులో హెడ్ గుమాస్తాగా చేరారు.

ఉపాధ్యాయ వృత్తిని వదలిపెట్టి గుమాస్తా ఉద్యోగంలో చేరడమేమిటని సందేహం రావచ్చు. ఆ రోజుల్లో కాలేజీ టీచర్ జీతం ఇరవై అయిదు రూపాయలు. గవర్నమెంటు ఉద్యోగమైతే జీతమూ ఎక్కువ వచ్చేది; క్రమేణా పై ఉద్యోగాలకు పాకే అవకాశాలు ఉండేవి.

అందువల్ల కాబోలు గురజాడ ప్రభుత్వోద్యోగంలో చేరారు. అందులో కొద్ది నెలలు మాత్రమే పని చేశారు.

1887 అక్టోబరులో ఆయన రు.100/- జీతం మీద

విజయనగరం కళాశాలలో లెక్చరరుగా చేరారు. నాలుగు సంవత్సరాల తరువాత 1891లో ఉద్యోగంలో ఇంకో మెట్టు పైకి ఎక్కారు. జీతం రు.100 నుంచి రు.125/- కి పెరిగింది. ఇంగ్లీషు, వ్యాకరణం, సంస్కృత సార స్వతం, తర్జుమా, గ్రీకు, రోమన్ చరిత్రలు ఆయన ఎఫ్.ఎ., బి.ఎ. క్లాసులకు బోధించేవారు.

విద్యార్థులకు అత్తెసరు మార్కులు, తమకు నెల జీతం వస్తే చాలుననుకునే స్వభావం కాదు గురజాడది.

విమర్శగా చదువు నేర్పాలనీ, స్వతంత్ర ఆలోచనా శక్తిని పురికొల్పేట్టుగా బోధనాక్రమం ఉండాలనీ ఆయన భావించారు.

లెక్చరరుగా ఉన్నప్పుడు గురజాడ మద్రాసు, బెంగుళూరు వంటి నగరాలకు వెళ్ళి అక్కడి ఉపాధ్యాయులు బోధించే పద్ధతులను ఆకళించుకొన్నారు. వారితో కళాశాల విద్యకు సంబంధించిన విషయాలపై చర్చలు జరిపారు.

విజయనగరం తిరిగి వచ్చి తమ కళాశాలలోని బోధనా పద్ధతులకూ, తాము చూసి వచ్చిన ప్రాంతాలలో పరిశీలించిన వాటికి మధ్యగల తేడాలను బేరీజు వేసుకున్నారు.

విద్యార్థులకు చక్కగా అర్థమయ్యేటట్లు, కొత్త ఆలోచనలు రేకెత్తించేటట్లు ఇంగ్లీషు సాహిత్యాన్ని, చరిత్రను బోధించి వారందరికీ తలలో నాల్కు అయ్యారు.

గురజాడ విజయనగరం కళాశాలలో పనిచేసే రోజుల్లోనే ఆనందగజపతి మహారాజుతో పరిచయం కలిగింది. ఆనందగజపతికి కళలు, సాహిత్యం, చరిత్ర పరిశోధన, సంఘ సంస్కరణ మొదలైన విషయాలంటే గొప్ప ఆసక్తి. ఆయన 1896 జూన్‌లో గురజాడను లెక్చరర్ పదవి నుంచి తప్పించి శాసన పరిశోధకుడుగా నియమించారు.

పూసపాటి వారి వంశ చరిత్రను రాయడానికి గురజాడ అప్పారావు చాలా శ్రమించి పరిశోధన చేశారు.



నిత్యనూతనముగా మన మధ్య వెలుగుతూ ఉండే మనిషి గిరీశం. తెలుగు సాహిత్యంలోకి వందేళ్లక్రింద ప్రవేశించి ఇంకా ఇంకా నిష్క్రమించని అపూర్వ సృష్టి గిరీశం.

శ్రీ పి.వి.జి.రాజు, వారి కుమారులు ఆనందగజపతి రాజు, అశోకగజపతి రాజు పూసపాటి వంశీయులే. విజయనగరం సంస్థానం చరిత్ర రాయడానికి ఎన్నో వివరాలు సేకరించారుగాని వాటిని దండగుచ్చి పుస్తకరూపంలో తేవడానికి అవకాశం చిక్కలేదు.

## కన్యాశుల్కం

ఆ కాలంలో ఆనందగజపతి మహారాజు విశాఖమండలంలో జరుగుతూ ఉండే కన్యాశుల్క వివాహాల వివరాలు సేకరించారు.

కన్యాశుల్కమంటే చేసుకోబోయే కన్యకు ఖరీదు కట్టి డబ్బిచ్చి వివాహం చేసుకోవడం.

ఆరోజుల్లో బాల్య వివాహాలు జరిగేవి.

మాటలు సరిగా రాని చిన్న బిడ్డల్ని కూడా కట్నం పోసి కొనుక్కొని వయసువాడు, ముసలివాడు అనే తేడా లేకుండా మగ మహారాజులు తాళి కట్టేవాళ్ళు.

కడుపులో ఉన్న బిడ్డల్ని కూడా కొనడానికి (పుట్టే



జీవితంలోని అన్ని రంగాలలోనూ, పట్న వాసంలో, పల్లెటూళ్ళో తన సామర్థ్యాన్ని సందేహించ నక్కరలేని వ్యక్తి సంచరించే ధీమాతో సునాయసంగా కదుల్తుంది మధురవాణి. మధురవాణి యే స్థలాన్నైనా ఏ స్థితినైనా లొంగదీసుకోగలదు.



మామి  చిగురులాగా
కలసి కదిలి మెదితే ఇంటింటి
తెలుగుతల్లి-కన్యాశుల్కంలో అల-
రించిన మన సహోదరి బుచ్చమ్మ.

బిడ్డ ఆడో మగో తెలియకుండానే) బేరసారాలు జరుగుతుండేవి.

ఆడ శిశువంటే అంత లోకువ. అదొక భయంకరమైన సాంఘిక దురాచారం.

కాటికి కాళ్లు చాచుకొని వున్న ముసలి పెళ్లి కొడుకులకు ముక్కుపచ్చలారని పసి పిల్లలను డబ్బు కక్కుర్తి వల్ల అమ్ముకోవడం గురజాడ అప్పారావు మనస్సును కలచివేసింది. ఆ విషయాన్నే ఆయన కన్యాశుల్క నాటకంగా రాశారు.

అందులో ఆనాటి సాంఘిక జీవనం కళ్లకు కడుతుంది.

మధురవాణి, గిరీశం, రామప్పంతులు లుబ్ధావధాన్లు, బుచ్చమ్మ, సౌజన్యరావు మొదలైన ఆ నాటకంలోని పాత్రలను విద్యావంతులైన తెలుగువారు ఇప్పటికీ ప్రస్తావిస్తూ ఉంటారు. వారి సంభాషణలను నెమరుకు



"నేనా పీసిరిగొట్టుని? వొక్క పాటున పద్దెనిమిది వొందలు యే పిసిరిగొట్టు పోస్తాడు?" ఇదీ లుబ్ధావధానులు వరుస మళ్ళీ ఇనప్పెట్టెముందు కూర్చొని అంటాడు కదా "బీదవాణ్ణి నేను డబ్బివ్వలేనే?"

తెచ్చుకొంటూ ఉంటారు. తెలుగులో వాడుక భాషలో రాసిన మొట్టమొదటి సాంఘిక నాటకం కన్యాశుల్కం.

'కన్యాశుల్కం' రచన ద్వారా గురజాడ తాను తల పెట్టిన ఉద్యమం ఆశయాలేమిటో చెప్పారు.

---- సంఘానికి పాడుపేరు తెచ్చి కంపు కొట్టించే పరిస్థితిని కళ్లకు కట్టి, మంచి నీతిని పెంచే భావాలను సాహిత్యం ప్రచారం చేయాలి.

----చక్కటి నాటకం ద్వారా సంఘంలోని చెడుగును ఎండగట్టి ప్రజాభిప్రాయాన్ని తీర్చి దిద్దాలి.

----ప్రజలు విద్యావంతులయ్యే వరకు నాటక రంగం నుంచి మాత్రమే అటువంటి ఆరోగ్యకరమైన ప్రభావం ఆశించవచ్చు.

----ప్రజలకు అర్థంగాని గ్రాంథికభాషకన్నా వాడుక భాష అందరికీ సులభంగా తెలుస్తుంది. కాబట్టి కన్యాశుల్కం నాటకం వాడుక భాషలో రాశారు. నాట



"సెల్లింగ్ గరల్స్ అనగా కన్యాశుల్కం" - "తాంబూలం ఇచ్చేశాం తన్నుకు చావండి" అని ఇంటింట వినిపించే ఈ పదాల మెలకువలు మీ చిన్నారి తలపుల్లో అల్లరి చేసే కన్యాశుల్కం వెంకమ్మ-సుబ్బి.

కంలోని పాత్రలకు కూడా వాడుక భాషనప్పుతుంది.

—మాతృభాష అయిన తెలుగులో చేసిన రచనలు రైతులను మేల్కొలుపుతాయి. భారత దేశంలోని ఇంగ్లీషు వారినీ దేశభాషలలోని సాహిత్యం ఆలోచింపజేస్తుంది.

—తెలుగు రచనలలో కొత్త భాష రూపొందాలి. గొప్ప రచయిత దానిని సృష్టించాలి. అతని కోసం మనం రంగాన్ని సిద్ధపరిచి ఉంచాలి.

ఇవీ ఆయన భావాలు. ఆ కొత్త భాషను ఎవరో కాదు, గురజాడే సృష్టించారు. ముందు బాటను అందంగా పరచిందీ ఆయనే—



ప్రపంచ సాహిత్యంలోనే
ఇంతటి గొప్ప పాత్ర గొప్ప
సన్నివేశం దొరకదు. పెరిగి
పెద్దవాళ్లైె మన గురజాడ మన-
కేల ఇదీ అప్పజెప్పి దారి
చూపి వెళ్లాడు అని మీరు
ముచ్చటపడే పూటకూళ్ళ పెద్దమ్మ.

# మూఢ వ్యవస్థపై పోరాటం



మన దేశ సంపద దోపిడీ కావడం ఇంగ్లీషుపాలన వల్ల కలిగిన చెడు ఫలితమైతే, కొత్త భావాలు వికసించడం ఇంగ్లీషు భాషతో, సాహిత్యంతో పెరిగిన పరిచయం వల్ల చేకూరిన మంచి ఫలితం.

బెంగాల్‌లో రాజారామమోహన్ రాయ్, ఆంధ్ర దేశంలో కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావులాంటివారు ఆ మంచి ఫలితాలకు గుర్తులుగా ప్రకాశించారు.

దేశం ముందంజ వేయకుండా అడ్డు పడ్డవి మూఢాచారాలే. వాటికి వ్యతిరేకంగా పోరాడ వలసిన అవసరాన్ని గురజాడ అప్పారావు గుర్తించారు.

కులవ్యవస్థ, అంటరానితనం, మతాల మధ్య విరోధాలు మొదలైనవి దేశం అభివృద్ధికి వేరుపురుగుల



ఈ బైరాగి ఎవరో మనకి తెలియదు. ఇతనికొక చిరునామా లేదు. దేశకాలావధులను దాటి సంచరిస్తూ ఉంటాడు. ఇతనికి వయస్సులేదు. (ఇందుకు బైరాగి మాట తప్ప ఇంకో సాక్ష్యం లేదు.) ఇతని ప్రధాన కార్యాలయం హరిద్వారంలో ఉందేమో! కాని దాన్ని చూసిన వారెవరూ లేరు. ఎంచేతనంటే అది ఇకముందు కట్టబోయేది.

— శ్రీ శ్రీ

య్యాయని ఆయన గ్రహించారు. 1910లో బరంపురంలో జరిగిన నానావర్ణ సహ పంక్తి భోజనంలో (అన్ని కులాలవారు ఒకరి సరసన మరొకరు కూర్చొని కలసి భోజనం చేయడం) అప్పారావు పాల్గొన్నారు. అప్పుడు రాశారు ఆయన ఒక ముత్యాల సరం.

"ఎల్లలోకములొక్క యిల్లై
వర్ణభేదములెల్లకల్లై
వేలనెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ."

× × ×

"మతములన్నియు మాసిపోవును
జ్ఞానమొక్కటి నిలచి వెలుగును"

కులభేదాలన్నీ కల్ల కావాలనీ, ఎల్లలోకం ఒక్కయిల్లుగా ఉండాలనీ గురజాడ ఆశించారు. మతాలన్నీ మాసిపోయి జ్ఞానం ఒక్కటే నిలచి వెలుగుతుం

దనీ ఆయన భావన. ఈ ప్రపంచం అంతా ఏక కుటుంబం కావాలని ఆయన కోరిక.

ఏనాడో ఎనభై యేళ్ల క్రిందట ఇంత గొప్ప భావాలను ప్రచారం చేయడమంటే సామాన్యం కాదు.

మన కులవ్యవస్థలోని కుళ్లును, అంటరానితనాన్ని గురజాడ అసహ్యించుకొంటూ కవితలు రాశారు.

మాలలు మలిన దేహులంటూ కులవ్యవస్థ ఈసడించుకొంటున్నదే! మలినమై పోయిన మనస్సులు కలవాళ్లకు పెద్ద కులాలవాళ్లుగా ఎందుకు పీట వెయ్యాలి? ఇటువంటి వర్ణధర్మం అధర్మం కాదా? అని గురజాడ ప్రశ్నించారు.

"మంచి, చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ, రెండె కులములు."

మనుషుల్లో రెండే కులాలు. అవి మంచి చెడ్డలు.

ఆ 'మంచి యన్నది మాలయైతే మాలనే అగుదున్'
అని గురజాడ 'లవణరాజుకల' అనే గేయ కథానికలో
పాడాడు.

### తోకచుక్క

వెనకటి కాలంలో ఆకాశంలో తోకచుక్క కనిపిస్తే జనం హడలిపోయేవాళ్లు. ఏదో ప్రళయం ముంచుకొస్తుందని ఆనాడున్న మూఢ నమ్మకం.

1910లో హెయిలీ తోకచుక్క కన్పించింది. ప్రజల్లో అలజడి పుట్టింది. ఆ గుడ్డి నమ్మకాన్ని చెదరగొట్టడానికి గురజాడ అప్పారావు ఇలా రాశారు.

"అరుదుగా మిను చప్పరంబున
చొప్పు తెలియని వింతపొడమగ
చన్నకాలపు చిన్న బుద్ధులు
బెదిరి ఎంచిరి కీడుగా"

తోకచుక్క అరుదుగా ఆకాశంలో తోచే వింత.

అది చూడగానే పాతకాలపు చిన్న బుద్ధులు కీడు అనుకొని బెదిరిపోతారు

"దూరబంధువు యితడు భూమికి,
దారి బోవుచు చూడవచ్చెను
డెబ్బదెనుబది యేండ్లకొకతరి
నరుల కన్నుల పండువై"

హెయిలీ తోకచుక్క 70-80 ఏళ్లకొకసారి భూమికి దగ్గరగా వస్తుంది. ఇది దూరపు బంధువే గాని శత్రువు కాదు అని గురజాడ చమత్కరిస్తారు.

తోకచుక్క కనిపించే దృశ్యం మనుష్యులకు కన్నుల పండుగ.

"తెగులు కిరవని కతలపన్నుచు
దిగులు చెందుటిదేటి కార్యము?
తలతు నేనిది సంఘ సంస్కర

ణ ప్రయాణ పతాక గాన్."

తెగులు అరిష్టాలు అని అర్థం పుట్టే కథలు కల్పించుకొని దిగులు పడడం ఏం పని? తోకచుక్కను నేను సంఘసంస్కరణకు ఎత్తిన పతాకంగా భావిస్తాను అని గురజాడ ధైర్యం చెప్పారు.

నిరాధారమైన వాటని నమ్మటం, నమ్మించటం తప్పు.

సూర్యోదయం అంటే సూర్యుడు ఏడుగుర్రాల రథం మీద తూర్పు దిక్కున రావడమనీ, సూర్యాస్తమయం అంటే సూర్యుడు పడమటి కొండల చాటుకు వెళ్లి పోవడమనీ మన పూర్వ కవులు నూరిపోశారు.

భూమి బల్లపరుపుగా ఉండడం చేత హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు దానిని చాపను చుట్టినట్టు చుట్టే శాడనీ పౌరాణిక కావ్యాలు నమ్మించాయి.

పసితనం నుంచీ పిల్లల లేత బుర్రల్లోకి ఎక్కించిన

ఈ కట్టు కథలు శాస్త్రీయ దృష్టి లేకుండా చేశాయి. వాటికి విరుగుడుగా గురజాడ మనుషుల మనస్సులకు వికాసం కలిగించే రచనలు చేశారు.

వెనకటి ఆలోచనలు, నమ్మకాలు, ఆచారాలు మారే కాలం కారణంగాను పరిస్థితుల్లో మార్పు వల్లా పనికి రాకుండా పోతాయి. అవి మనిషిని ముందుకు వెళ్ల నివ్వకుండా వెనుకకి లాగుతాయి.

అటువంటి వెనక చూపును కాలమాన పరిస్థితుల్ని అనుసరించి మార్చుకొని ముందుచూపును అలవర్చుకో వాలి. అందుకోసం గురజాడ అప్పారావు భాషలో, భావంలో మార్పు తెచ్చాడు. పెద్దవారయ్యాక మీరు ఆయన నాటకాలు, కవితలు, కథలు, డైరీలు చదివితే గురజాడ ఆనాడే సంఘాన్ని ఆధునికంగా తీర్చిదిద్దడా నికి ఎంత పాటుపడ్డారో అర్థమవుతుంది.

# పుత్తడిబొమ్మ పూర్ణమ్మ



గురజాడ అప్పారావు రాసిన ముత్యాలసరాలలో 'పూర్ణమ్మ' గొప్ప గేయ కథానిక. ఆ రోజుల్లో తల్లి దండ్రులు తమ పిల్లల్ని డబ్బుకు ఆశపడి కాటికి కాళ్లు చాచుకున్న ముసలి వాళ్లకు ముడి వేసేవాళ్లు.

పూర్ణమ్మ అటువంటి దురదృష్టవంతురాలు. తల్లి దండ్రులు ఆమెను ఒక ముసలివాడికి కట్టబెడతారు.

"మేలిమి బంగరు మెలతల్లారా!

కలువల కన్నుల కన్నెల్లారా!

తల్లుల గన్నా పిల్లల్లారా!

విన్నారమ్మా యీ కథను"

ఆ కథ ఎలా సాగింది?

పూర్ణమ్మను తీసుకువెళ్లడానికి ముసలి భర్త వేంచేస్తాడు.

అతణ్ణి చూడగానే పూర్ణమ్మ ఎలా అయిపోయింది?

"ముద్దు నగవులూ మురిపెంబు మరి

పెనిమిటి గాంచిన నిముషమున

బాసెను కన్నియ ముఖకమలమ్మును

కన్నుల గమ్మెను కన్నీరు."

కమలంలాంటి ఆమె ముఖంలో ముద్దొచ్చే చిరునవ్వూ, మురిపెము మాయమయ్యాయి.

కళ్లలో నీళ్ళు నిలచాయి.

పూర్ణమ్మను అత్తవారింటికి సాగనంపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆమె కూడా సిద్ధమైంది.

అత్తవారింటికి కాదు. మళ్లీ తిరిగిరాని చోటుకు...

ఆమె బతుకును బద్దలు చేసిన తల్లిదండ్రులు దీవించారు.

"దీవనవింటూ పక్కన నవ్వేను

పుత్తడిబొమ్మా పూర్ణమ్మా!"

ఎటువంటి నవ్వు అది?

హిందూ సంఘమంతా ఉలిక్కి పడాల్సిన నవ్వు.

ఆమె అందరి వద్దా కడసారి సెలవు తీసుకొంటుంది. అప్పుడంటుంది కదా!....

"నలుగురు కూచుని నవ్వే వేళల

నా పేరొక పరి తలవండి!

మీమీ కన్నబిడ్డల నొకతెకు

ప్రేమను నా పేరివ్వండి."

ఇది పూర్ణమ్మ ఆఖరి కోర్కె. ఈ చరణాలలో పూర్ణమ్మ పేరు స్త్రీ జాతికి వారసత్వం అవుతుందని గురజాడ భావించారు. స్త్రీల స్థితి గతులను సంస్కరించే ఆకాలం నాటి ప్రయత్నం స్త్రీవిముక్తి ఉద్యమంగా పోరాటంగా

వర్థిల్లుతుందని గురజాడ ఆశించారు. భవిష్యత్తుపై ఆయనకు ఉన్న ఆశలు వమ్ముకాలేదు.

"బలబల కన్నీరొలికెను
పుత్తడి బొమ్మకు పూర్ణమ్మకు."

పూర్ణమ్మకే కాదు. చదివే అందరికీ కంట నీరొలుకుతుంది. కన్యల్ని కాటికి కాళ్లు చాచిన ముసలివాళ్లకిచ్చే దురాచారం మీద కసి పుడుతుంది. డబ్బుకు కక్కుర్తి పడే అమ్మా అయ్యలకు గడ్డిపెడుతుంది.

దుర్గ పూజకని వెళ్లిన పూర్ణమ్మ యింటికి తిరిగి రాలేదు.

ఇంటికి తిరిగి రాలేదంటే ఆ విధంగా ఆమె ఆనాటి వివాహవ్యవస్థ మీదా ఆ వ్యవస్థ కొనసాగడానికి కారకులైన వారందరి మీదా తన తీవ్ర నిరసనను తెలియజేసింది.

ఆమె ఆహూతి అంతం కాదు. స్త్రీ లోకపు జాగృ



"నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొక తరి తలవండి;
మీమీ కన్న బిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి."

అంటూ దుర్గను చేరుతున్న పుత్తడి బొమ్మ పూర్ణమ్మ.

తికి ఆరంభం.

ఆమె దుర్గలో ఐక్యం కావటమంటే ఒక అబల అసహాయురాలు శక్తిస్వరూపిణి కావటమనికూడా అర్థం చేసుకోవచ్చు.

ఆవులు పెయ్యలు మందల చేరాయి.

పిట్టలు గూళ్లు చేరాయి.

ఆకాశంలో చుక్కలు మెరిశాయి.

ఏమైపోయింది పుత్తడిబొమ్మ పూర్ణమ్మ?

"కన్నుల కాంతులు కలువల చేరెను

మేలిమి జేరెను మేనిపసల్

హంసల జేరెను నడకల బెడగులు

దుర్గను జేరెను పూర్ణమ్మ."

పూర్ణమ్మ మరణాన్ని ఇంతగా హృదయాన్ని కది

లించేలాగా ఎవరు వర్ణించగలరు?

ఒక్కొక్క అక్షరం ఒక్కో కన్నీటి చుక్క.



# 'కన్యక'



తల్లిదండ్రుల ధనాశకూ; తాళికట్టిన ముసలి మొగుడు తగని గుణానికీ పూర్ణమ్మ బలి అయిపోయినట్లే, 'కన్యక' కావ్యంలో పట్నమేలే రాజుపట్టలేని మోహానికి కన్యక ఆహుతి అవుతుంది.

కన్యక చాలా అందమైన వైశ్యబాల. ఒక రోజు కన్యక దేవాలయానికి వెళ్తుండగా ఆ పురం ఏలే రాజు కంటబడుతుంది. కన్యక అందానికి రాజుకు కళ్లు చెదిరాయి. "పట్టవలెరా దీని బలిమిని" అని తలపోస్తాడు. వెంటనే పట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు.

"దైవకార్యం తీర్చి వచ్చెద"నని అప్పటికి తప్పించుకొంటుంది.

కన్యక తండ్రీ, బంధువులు ఆమెని అగ్నిసాక్షిగా పెండ్లి చేసుకోండని రాజును వేడుకుంటారు. అతడు కన్యకను రాక్షసంగా చెరపట్టటానికే తయారవుతాడు.

లించేలాగా ఎవరు వర్ణించగలరు?

ఒక్కొక్క అక్షరం ఒక్కో కన్నీటి చుక్క.



"పట్టపగలే నట్టివీధిని
పట్టబోరే జారచోరులు
పట్టదలచితివింక నీవొక
పట్ణమేలే రాజువట!
కండకావరమెక్కి నీవీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా ఒక దైవమంటూ
వుండి వూర్కొనునా?"

అంటూ కన్యక రాజును సవాలు చేసి మంటల్లో దూకి ఆత్మార్పణ చేస్తుంది.

పట్నమేలే రాజు గర్వం మట్టి కలిసిపోయింది.

స్త్రీలపై అటువంటి అత్యాచార ప్రయత్నాలు ఈనాటికీ జరుగుతూనే ఉన్నాయి. అభిమానవతియైన కన్య

రాజుదుర్మార్గానికి అణగి మణగి ఉండకుండా నిర్భయంగా ఎదుర్కొన్న ధైర్యానికి 'కన్యక' కావ్యం నివాళి.



# ఆణి ముత్యాలు



తెలుగులో కొత్త రకంగా కథలు రాసిన మొట్ట మొదటి వాడు గురజాడ అప్పారావు గారేనని ముందే చెప్పుకొన్నాం.

ఆయనకు ముందు కథలు లేవా అంటే, ఎందుకు లేవు? ఉన్నాయి.

పేదరాసి పెద్దమ్మ కథలు, కాశీమజిలీ కథలు, పంచ తంత్రం కథలు, శుకసప్తతి కథలు, తెనాలి రామలింగని కథలు, భేతాళ కథలు, మదన కామరాజు కథలు... ఇలా చెప్పుకొంటూ పోతే కొండవీటి చాంతాడంతటి జాబితా అవుతుంది.

అవన్నీ కాలక్షేపం కథలు, వాస్తవ జీవితంతో సంబంధం ఉన్నవి కాదు, కేవలం కల్పనలు. "జీవితా నికీ జీవితానుభవాలకూ చెందనివీ, పొందనివీ."

కాని గురజాడ కథలు ఆకాలానికి, ఆనాటి జీవితానికి సంబంధించినవి.

జీవితంలో ఓడిపోయిన స్త్రీలు, వారి వివాహ సమస్యలు, యవ్వనంలో ఉన్న భార్యతో ముసలి భర్తల కాపురం, వితంతు వివాహాలు, వయస్సు తేడాతో జరిగే పెళ్ళిళ్ళ ఫలితంగా వైధవ్యాలు, అక్రమ సంబంధాలు, గర్భాలు, గర్భస్రావాలు, స్త్రీ విద్య, కులాంతర వివాహాలు, స్త్రీలపైన జరిగే దుండగాలు మొదలైన అనేక విషయాల మీద గురజాడ కథలు రాశారు.

'దిద్దుబాటు', 'మెటిల్డా', 'సంస్కర్త హృదయం', 'సౌదామిని' మొదలైన కథలన్నీ స్త్రీలను గురించి రాసినవే.

మగవాడి దౌర్జన్యం నుంచి ఆత్మరక్షణ కోసం స్త్రీ కత్తిసాము నేర్చుకోవాలని గురజాడ ఆనాడే చెప్పడం మామూలు విషయం కాదు. ఈనాడు యువతులు

కరాటే వంటిపోరాట విద్యలు నేర్చుకొంటున్నారు కాబట్టి గురజాడ ఆనాడు చెప్పింది ఇప్పుడు చదివితే విడ్డూరం అనిపించకపోవచ్చు.

అట్లాగే మరీ విపరీతంగా బిగుసుకు పోయిన పెళ్లి తాడు గురించి ఆయన ఆలోచనలు ఆశ్చర్యం కలిగి స్తాయి. ఎందుకంటే ఇరవయ్యో శతాబ్దం మొదట్లో అటువంటివి ఊహించరానివి.

ఆయన ఎంతో ముందు చూపుకలవాడు కాబట్టి ఈ కాలంలో ఆచరణ సాధ్యమైనవి ఆనాడే భావించి భావి తరాలకు అందజేశాడు.

"ఈ సమాజంలో స్త్రీల కన్నీటి గాథలకు కారణం నాకు తెలుసును. తిరిగి వివాహం ఆడకూడదనే నియమం, విడాకుల హక్కు లేని కారణం, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం స్త్రీల కన్నీటి గాథలకు హేతువులు" అని గురజాడ అప్పారావు రాశారు.

ఆయన నిరాశతో కుంగిపోలేదు. ముందు కాలంలో స్త్రీలు ఊహించలేనంత అభివృద్ధి సాధిస్తారని ఆయన నమ్మారు.

"ఆధునిక మహిళలు భారతదేశ చరిత్రను తిరిగి రచిస్తారు" అని ఆయన ఆశాభావం. ఆయన ఆశలు నెమ్మదిగా నిజమవుతున్నాయి. స్త్రీలు చొరవ పూని అన్ని రంగాలలో ముందంజ వేయడానికి పట్టుదలతో ప్రయత్నిస్తున్నారు. స్త్రీ–పురుష సమానత్వం కల కాదు, కల్లకాదు, మనకళ్ల ముందే వాస్తవం కాబో తున్న ఆదర్శం.



# 'ఉంగరెత్తుము'



గురజాడ అప్పారావు షుమారు ముప్ఫై ఏళ్లపాటు భాషా సాహిత్యాలలో విరామం ఎరుగకుండా పరిశ్రమించారు. స్నేహమూ, ప్రేమా అనే రెండు వెలుగులను మానవుల మీదకి తిప్పి కొత్త కాంతులు నింపారు.

1915 వ సంవత్సరం ప్రవేశించే నాటికి గురజాడ ఆరోగ్యం క్షీణించి పోయింది. మొట్టమొదట్నుంచీ కూడా ఆయన బహు పల్చనిమనిషి. వేసవి కాలంలో కూడా చొక్కామీద ఉన్నికోటు వేసుకొని, దాని మీద శాలువ కప్పుకొని, మేజోళ్లు తొడుక్కుంటేనే గాని ఉండలేకపోయేవారు.

బాల్యం నుంచీ కూడా తనకు అలసట ఎక్కువగా ఉండేదని ఆయన రాసుకున్నారు. మెదడుతో ఆలోచించడం వల్ల కలిగే శ్రమ కూడా ఆయన అలసటను పెంచింది. ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఆయన

బరువు 78 పౌన్లకు తగ్గిపోయింది.

అయినా రాయాలనే కాంక్ష తరిగిపోలేదు.చనిపోవ డానికి కొద్ది నెలల ముందు 'లంగరెత్తుము' అనే ఖండ కావ్యం రాశారు. అందులో ఆయన ఆత్మ వేదన ఉంది. జీవితమనే రేవులో తన ప్రాణమనే నౌక ఇంకా ఉండి లాభం లేదనుకున్నారు.

నౌకను రేవు విడిచి పెట్టమన్నారు. లంగరెత్తమ న్నారు.

"........ఇక నేమిలోకము!
చాలు! చాలు! లంగరెత్తుము"

అట్లాగే జరిగింది. గురజాడ 1915 నవంబరు 30న శాశ్వతంగా కన్నుమూశారు.

తెలుగు భాష ఉన్నంత కాలం ఆయన రచనలు ప్రజల కనులముందు నిలచి కొత్త వెలుగులు విరజి మ్ముతూనే ఉంటాయి.

# మహాకవి గురజాడ జీవిత వివరాలు



కృష్ణాజిల్లా నుంచి విశాఖ తరలివచ్చారు తండ్రి వెంకటరామదాసు తల్లి కౌశల్యమ్మ

1862 సెప్టెంబరు 21 పుట్టినతేది

విశాఖజిల్లా, ఎలమంచిలి తాలూకా రాయవరం గ్రామం

1882- మెట్రిక్యులేషన్

1883- 'సారంగధర'అన్న ఇంగ్లీషుపద్యకావ్యప్రచురణ .

1884- విజయనగరం మహారాజకాలేజీ హైస్కూల్లో ఉపాధ్యాయ వృత్తి,

1885- వివాహం-భార్య, అప్పలనరసమ్మ

1887- విజయనగర మహారాజు ఆనందగజపతి పరిచయం

1892- కన్యాశుల్కం మొదటి కూర్పు.

1910- ఆధునిక కవితాగీతాలు 'ముత్యాలసరములు' ప్రచురణ.

1911- లవణరాజుకల ప్రచురణ. 1912- కన్యక ప్రచురణ.

1914- దించులంగరు.

1915- నవంబరు 30 మరణం.



## దేశభక్తి*

దేశమును ప్రేమించుమన్నా!
మంచి అన్నది పెంచుమన్నా!
వొట్టి మాటలు కట్టిపెట్టోయ్,
గట్టిమేల్ తలపెట్టవోయ్!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు, పాటుపడవోయ్.
తిండి కలిగితె, కండ కలదోయ్.
కండ కలవాడేను మనిషోయ్!

ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్.
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నింపవోయ్.